Regd No. N. 46 / M. 3813

వెల ఒక అణా





ప్రతి సోమ గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక



సంపుటము ౧౬ ★ హైద్రాబాదు, దక్కన్. శా. శ. ౧౮౬౩ వృషసం॥ర కార్తీక బ॥ ౩ (౭-౨-౧౩౫౧ ఫ.) గురువారము ★ సంచిక ౫౧

# తూలాదుర్గములను జర్మనులు భేదించినారు

## క్రిమియాలోకూడ జర్మనుల పురోగమనము

రష్యాజర్మనీల యుద్ధమునుగురించి అక్టోబరు ౩౧ నవంబరు ౧ వ తేదులలో వచ్చినవార్తలు రష్యావారిస్థితినిగురించి అంత సంతోషించదగినవి గాలేవు.

మాస్కో-దక్షిణమున ౧౦౦ మైళ్లదూరములో తూలానగరము చుట్టునుండు దుర్గములను భేదించుకొని జర్మనులు ఆనగరపరిసరములకు చేరిపోరాడుచు ముందుకుపోవుచున్నారు. రష్యావారిసేనలు ఎంతఎక్కువగానున్నను వెనుకకుపోవుచున్నవి. తూలాపట్టణము పరిశ్రమలుండుచోటు-అక్టోబరు ౩౧ వ తేదీవరకు పోరాటములో వోలాకొలాంస్కు-ప్రాంతములో రష్యావారలసేనలు కొద్దిగా వెనుకకుపోయినవి. కాలినిన్ వద్ద అనేకదినములనుండి ముట్టడించబడియున్న రష్యాకార్మికులు చిన్నదళమొకటి ౩౧ వ తేదిన తప్పించుకొనిపోయి ప్రధానసేనతో కలిసినది. ఇప్పుడు కాలినిన్ వద్ద రష్యాసేనలు తమస్థానములనువదలి వెనుకకుపోకుండవున్నవి, అంతవరకే తూలాకును మాలోమాస్లావెట్లకును మధ్య రష్యనులుంచిన కావలిని జర్మనులుదాటకుండ అడ్డుచున్నారు. ...

డి. లెనిన్గ్రాడుకిది తూర్పున ౩౦ మైళ్ళదూరములోనున్నది-

అక్టోబరు ౩౧ వ తేదిన జర్మనుఫిరంగులు లెనిన్గ్రాడుపై బారుపెట్టబడినవి, అనాటిరాత్రి మాస్కో-నగరముపై జర్మను విమానాలు గుంపులు గుంపులుగా వచ్చి బాంబులు వేసిపోయినవి-

రష్యావారిజలాంతర్గామి యొకటి మూడు జర్మనునౌకలను బాల్టిక్ సముద్రములో ముంచివేసినది ఇదేబాల్టిక్ సముద్రములో మరిమూడు శత్రునౌకలను రష్యావారిమోటారు టార్పిడోపడవలు ముంచివేసినవి-

అక్టోబరు ౩౧ నవంబరు ౧వ తేదులలో జర్మనీయుల యుద్ధమునుగురించి తెలిసిన మరికొన్ని ముఖ్య విషయములిట్లున్నవి. జర్మనులుపట్టుకొన్న ఖార్కోవులో చాలాపరిశ్రమలను రష్యనులు ఆనగరమును ఖాళీచేయక ముందు ధ్వంసముచేసి వెళ్ళినారు. ఇపుడు ఆనగరమువల్ల ప్రయోజనము అధికముగా ఆనేకమార్గముల కూడలిగా నుండుటయేయట-జర్మనులకు రుమేనియానుండి లభించే పెట్రోలు పూర్తిగా అయిపోయినదట. ఇపుడుజర్మనీలో వారుదాచిపెట్టుకొన్న పెట్రోలుమాత్రమేగతియని మాటుమిలేఖరి అనుచున్నాడు. రష్యావారి పారిశ్రామిక ప్రదేశముల నేకములు జర్మనుహస్తగతములైనను, వారలుఆప్రదేశములనుండి తమయంత్రములను తీసికొనిపోయి ఇతర ప్రదేశములలో ...

సో-నుండి వ్లాడివోస్టాకుకు ఎంతదూరమో న్యూయార్కు-నుండిగాని బోస్టనునుండిగాని ఆర్కేంజల్ నకుఅంతేదూరము, సుమారు ౫౦౦౦ మైళ్ళకు ఎక్కువకాని అమెరికాలోని పరిశ్రమస్థానము అనేకములు వ్లాడివోస్టాకు రేవుకంటె ఆర్కేంజల్ రేవుకే ఎక్కువసమీపములు- ఆర్కేంజల్ నుండి రష్యాలో అవసరస్థానాలకు సరకుపంపించుటకుగూడ ఆర్కేంజెలు రేవునకే రైలుబాట సౌకర్యమెక్కువయట- ఎట్లైననేమి ఇప్పుడు జపానువారు వ్లాడివోస్టాకు మీదుగా రష్యాకు అమెరికాసామగ్రి తీసికొనిపోవుటకు తాము సమ్మతించమని ఆక్షేపించినందుకు ఫలితము సిద్ధించినదికదా యని మురియవచ్చును- రష్యావారికి బ్రిటీషుసహాయమునూడ ఆర్కేంజల్ రేవుమీదుగా పోవుచున్నది.

### నవంబరు ౨,౩ తేదులవిశేషాలు

నవంబరు ౨వ తేదినాటికి మెంజెయిస్కు మాలోయారోస్లావెట్సు వోలా కొలాంస్కు-ప్రాంతములందు జర్మనుల గమనమును నిరోధించగల్గినట్లును, ఈచోట్లలో కొన్నిచోట్ల తామెదురుదాడులనుగూడ ప్రారంభించినట్లును కాలినిన్ పట్టణపరిసరగ్రామాలలో నొకదానిని పునరాక్రమించినట్లును, నారానదివద్ద జర్మనులనులేరిమివేసినట్లును లెనిన్గ్రాడువద్ద తమసేనలాకనదిని దాటినట్లును రష్యావారు ప్రకటించినారు- గాని ...

కుచమునకు పంపించుటకు కంపెనీ వారలకు లైసెన్సు లనునిచ్చుటలేదు.

అక్టోబరు నెలలో యల్లోనది దక్షిణమున కొన్నిస్థానములను జపానీయులు పట్టుకొన్నందున, వారలు హాయన్య రాష్ట్రమునకు చెర్సి ప్రధాననగరమగుసియాంగపైకికూడ పోవచ్చునని తలచి చైనా ప్రభుత్వమువారు తమసేనలును, చైనాకమ్యూనిస్టు సేనలునుకలిసి దానికిప్రతిక్రియచేయుట కెట్లనువిషయమున అకమ్యూనిస్టు నాయకులతో కలిసి ఆలోచించనున్నారట-జపానువారు యూచానునగరమును పట్టుకొనదలచుచున్నట్లు కనిపించుచున్నది-ఈనగరముమీదుగా బర్మానుండి చైనాకు సామగ్రులుపోవును-అందుచే చైనావారు ఆనగరమునుతప్పించుకొని చెంగ్టూగుండా పోవు ఒక రోడ్డును నిర్మించుచున్నారు- నిర్మాణము పూర్తికావచ్చుచున్నది

జపానువారి మాంచూకోవున్ను, రష్యావారి మంగోలుకున్ను మధ్యసరిహద్దునునిర్ణయించుటకై ఉభయపక్షప్రతినిధులను కలిపి నియోగించినసమితి తమపనినిముగించినట్లును, ఒడంబడికపై సంతకములుచేయబడినట్లును వార్తవచ్చినది.

### మరొక అమెరికా నౌక ముంచబడినది

అక్టోబర్ ౩౧వ తేదీ రాత్రి ఐస్లాండుకుసమీపముగా సముద్రంలో "ర్యూబెన్ జేమ్సు" అను అమెరికావారి డిస్ట్రాయరునౌక జర్మనులయూబోటు ...

### రష్యాకు సహాయము

### బ్రిటీషువారుముంచిన జర్మను నౌకలు

### జపానువారల వ్యవహారాలు

## జమాబందీ రుసుముల మాఫీ

ఇదివరలో హైద్రాబాదుశాసనసభలో జమాబందీ రుసుముల మాఫీనిగురించిన చర్చ జరిగి మాఫీయిచ్చుటకై తీర్మానమైయుండెను ఇప్పుడాతీర్మానమును మ.ఘ.వ. నిజాం ప్రభువుగారుఅంగీకరించి యిట్లాజ్ఞాపించినారు

స్టాంపుస్థానరుసుము శాసనములోని ౧౫వ సూత్రములోని ఉపనియమము(౫) ...కు పూర్వము మూడుకొత్త ఉపనియమాలు (జిమ్ను) ౬,౭,౮ అనునవి ఏర్పాటు చేయనైనవి-వాటిలోని అంశాలేవనగా

(౬) భూశాఖాధికారులవద్ద జమాబందీకి పూర్వముకాని తర్వాతకాని యిచ్చుకొను జమాబందీకిసంబంధించిన విజ్ఞప్తుల (దరఖాస్తుల)పైనను

(౭) జమాబందీ తీర్పులయొక్క ప్రతుల (నకళ్ల)కొరకు ఇచ్చుకొను విజ్ఞప్తులపైనను

(౮) జమాబందీతీర్పుయొక్క ప్రతికొరకును

(౯) జమాబందీతీర్పుపై మురాఫా, నిగరానీ, నజర్ సానీలకై యిచ్చుకొను విజ్ఞప్తుల పైనను

(౧౦) పైమురాఫా మున్నగు వ్యవహారములలో చిల్లరవిజ్ఞప్తు లిచ్చుకొనువాటిపైనను రాష్ట్రములోని వ్యవసాయకు లందరును స్టాంపుస్థానరుసుములను చెల్లించుకొనవసరములేదు.

పైశాసనమును రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారు గత సంవత్సరము శాసనసభలో ప్రవేశపెట్టి యుండిరి - వోట్లు అనుకూల ప్రతికూలములుగా సరిసమానముగా రాగా అధ్యక్షతవహించిన గౌ॥ అబ్దులజీజుమంత్రిగారు తమవోటుకంతోటును రాజా బహద్దరు గారి పక్షం ఇచ్చి చిత్తుశాసనాన్ని గెలిపి చిరి-ఇప్పుడదేతీర్మానాన్ని మ.ఘ.వ నిజాం ప్రభువుగారు అంగీకరించి శాసనముగాచేయుచి జరీదాలో ప్రకటింప చేసినారు.

### ఆర్యసమాజ సభ

హైదరాబాదు కృష్ణగంజ్ ఆర్యసమాజంలో తా ౧౫-౧౧-౧౯౪౧ శనివారమునాటి సాయంకాలము ౬-౩౦ నుండి ౯ గం. మున్నాలాల్ మిశ్రగారి భజనోపదేశము జరుగును. అందరు దయచేయప్రార్థన

